**Registered No. M-4345.**

# యుద్ధ సంచిక.

వాల్యూం II.] మద్రాసు · 1942 వ సం॥ మార్చి నెల 27 వ తేది శుక్రవారం [నెం 12 రు.

## యుద్ధ విమర్శ—విశేషాలు.

**బ్రిటను ఆయుధోత్పత్తి.**

బ్రిటనులో యుద్ధ పరికరాలు ఆయుధాల ఉత్పత్తి అంతకంతకు విపరీతంగా హెచ్చుచున్నది. ప్రధాని తరువాత ప్రధానిఅంతవాడు సి. ఆర్. ఆట్లీ మంత్రి గత ఆదివారం కర్మాగారాల కేంద్రస్థానమగు లివర్పూలులో ఉపన్యసించుచు, యీ ఆయుధోత్పత్తినిగూర్చి కొన్ని సంఖ్యలు తెలిపిరి. యుద్ధం ప్రారంభమయినప్పటికన్న యిపుడు యుద్ధ సామగ్రి పది రెట్లు అధికంగా యున్నదనిరి. డంకిర్కు యుద్ధం ముగిసినప్పటికన్న (1940 వ సం॥ జూన్) యిప్పుడు ఐదు రెట్లు టాంకులు తయారు చేయబడుచున్నవి. 1941 వ సం॥ ఆఖరు మూడు నెలలలో యుద్ధం ప్రారంభించుటకు పూర్వం మూడు నెలలలో కన్న ఐదు రెట్లు యుద్ధ నౌకలు నిర్మించబడినవి. వర్తక నౌకలు రెండింతలు ఎక్కువ తయారు చేయబడినవి. ఆఫ్రికా ప్రాంతముల యుద్ధంలో చేరియున్న సైన్యాలకు సరకు రవానాచేయుటకై ఆఫ్రికాకొసనున్న కేప్ ఆఫ్ గుడు హోప్ చుట్టి 11,000 మైళ్ళ సముద్రమార్గమునందు సర్వదా 300 నౌకలు నడచుచుండెను. 10 లక్షల టన్నులుమించిన సరుకు 30,000 మోటారు బండ్లను నౌకాదళం వారు రవానాచేసిరి. అని ఆట్లీగారు తెలిపిరి.

నేటి స్థితి యిదివరకు కన్న చాలబాగున్నదని వారు ముఖ్యంగా తెలిపిరి.

"అన్ని విధముల యోచించి చూచినచో రెండేండ్ల క్రిందటికన్న నేటి స్థితి చాల ఆశాజనకంగానుంది. జపాను యుద్ధంలో దిగుటతోడనే అక్షరాజ్యాలు తమ నిలువయున్న సేననంతను యుద్ధరంగంలో దించవలసివచ్చెను. మనవైపో మహావిశాలమగు చీనారాజ్యము, అమెరికా సంయుక్త రాష్ట్రములు చేరినవి. ఇప్పటివరకు అచ్చటచ్చట చిన్న విజయాలు డిక్టేటరులకు కలుగుచున్నను త్రాసు మనవైపే మొగ్గుచున్నది."

"అమెరికా, ఇంగ్లాండు, చీనా, రష్యా, సంయుక్త రాజ్యములకు అపారమగు శక్తి సంగ్రహించుగలదు దానిని వినియోగంలోనికి తెచ్చుటకు కొంత వ్యవధి కావలసియున్నది. అంతవరకు చెక్కు చెదరక డంకిర్కు యుద్ధాంతం నాటివలె మనం నిలచియుండవలెను. అప్పుడు ఇప్పటికన్న ఎక్కువ నిరాశగ నుండెను; దూరంగానైన ఆశాకిరణములపుడు అగుపడలేదు ఇపుడు అప్పటికన్న చాల నయం." అని ఆట్లీ మంత్రిగారు నుడివిరి.

**నౌకల ఉత్పత్తి.**

యుద్ధనౌకల ఉత్పత్తిని ప్రోత్సాహించుటకై ఇంగ్లాండులో యుద్ధనౌకల వారోత్సవం జరుపబడెను. ఆ సందర్భమున బ్రిటిషు రాజుగారును, మంత్రులును మంచి ఉత్సాహకరమగు సందేశముల నంపిరి. ఈ వారం ఉత్సవం చాల జయప్రదంగా జరిగినందుకు రాజుగారు చాలసంతసించుచున్నట్లు తెల్పుచు టెలిగ్రాం పంపిరి. "లండనులోని ఉత్సవములు యీ ఉద్యమానికి మకుటంవలె నుండగలవని భావించుచున్నాను" అని ఎర్నెస్టు బెవిను ఆరోగ్యశాఖ మంత్రిగారు నుడివిరి. నౌకలపై పనిచేయువారందరు కృషిచే, తిరుగు దెబ్బకొట్టుటకు యిదియే సమయమని నౌకాదళాధికారి అడ్మిరలు సర్ ఎడ్వర్డు ఇవాన్సుగారనిరి. ఇప్పటికన్న ఎక్కువ త్యాగం చేస్తేనే మనం జయించగలం అని వారన్నారు.

**గంటకో బాంబరు విమానం.**

అమెరికాలోగూడ యుద్ధ పరిశ్రమలను యింకను యెక్కువ పెద్దవిచేసి అతివడిగా తయారు చేయుటకు ఫోర్డుగారు తదితర ధనికులు కృషిచేయుచున్నారు. అమెరికా సంయుక్త రాష్ట్రములలో మధ్యగానున్న డెట్రియటు నగరమునందు ప్రపంచమంతటిలోకి అతి పెద్దదగు ఫ్యాక్టరీని ఫోర్డుగారు కట్టించుచున్నారు. ఫ్యాక్టరీ అంతా పెద్దహాలువలె వుండును. ఒకమైలు పొడుగు, అర మైలు వెడల్పు వుండును. అందులో పని త్వరలో ప్రారంభం కాగలదు. అందులో బాంబులువేసే విమానాలను గంటకొకటి తయారు చేయాలని ఫోర్డుగారి ఉద్దేశం. ఇతర మోటారుకారు కర్మాగారములందు విమానాల ఇంజనులు, ముందుచక్రం, ఫిరంగులు తయారగుచున్నవి గంటలలో అయేపని నిముసాలలో ముగుస్తున్నది. అమెరికాలో పరిశ్రమల అభివృద్ధి ఎంతవేగంగా అవుతున్నదంటే, తరుచు చూసేవారికిగూడ ఆశ్చర్యం కలిగిస్తున్నది. చలికాలం పోయేక నేర్పరులగు పనివారు చాలరేమోనన్నంత వడిగా కర్మాగారాల సంఖ్య హెచ్చిపోతున్నదని అధ్యక్షుడు రూజువెల్టుగారనిరి. వచ్చే నెలలో 45 సం॥ల నుండి 65 స॥ల వయస్సుగల వారందరిని 180 లక్షల మందిని పనిలో చేర్చుటకు రిజిష్టరీ చేస్తున్నారు.

**సంయుక్త రాజ్యాలు - అక్షరాజ్యాలు ఉత్పత్తి పోటీ.**

బ్రిటను-అమెరికాలు ఆయుధోత్పత్తి అతివడిగా కొనసాగిస్తున్నాయి. అక్షరాజ్యాల ఉత్పత్తికన్న అతిత్వరలో సంయుక్త రాజ్యాల ఉత్పత్తి మించిపోగలదు. జర్మనీ, జర్మనీ ఆక్రమించిన దేశాలు, ఇటలీ జపాను లన్నింటిలో తయారవుతున్న

విమానాలకన్న అమెరికా, ఇంగ్లాండు, కనడా దేశాలలో విమానాల ఉత్పత్తి ఇపుడు హెచ్చిందని, అమెరికాలో వ్యాపార విషయములందు అధికారరీత్యా ప్రకటించగల వాల్ స్ట్రీటు జర్నలు అను పత్రిక తెల్పుచున్నవి. టాంకుల ఉత్పత్తికూడా అక్షరాజ్యాల అంచనాలను మించిపోవును. ఇంగ్లాండు-అమెరికాల నౌకానిర్మాణం మిత్రమండలి అవసరానికి తగినంత ఎక్కువగ పెరగకపోయినా శత్రురాజ్యాల ఉత్పత్తిని మించిపోయిందని ఆ పత్రిక తెలుపుచున్నది.

మిత్రమండలి దేశాలందు కర్మాగారములలో జరుగుచున్న యీ పని అంతా హిట్లరు-ముసోలినీలు చూస్తే బాగుండును భయపడేవారని ఒక విలేఖరి ముచ్చటపడుతున్నాడు. మర ఫిరంగుల కర్మాగారములు అమెరికాదేశం పొడుగునా యున్నాయి. 375,000,000 పౌనుల విలువగల సామాను తయారు చేస్తున్నవి. ఆరు రకాల విమానాల రెక్కలు, వందలకొలది రకాల విమాన భాగాలు, 97 రకముల విమానం బాడీలు కుప్పలు కుప్పలుగా పడియుండుట తాను చూచితి నని ఆ విలేఖరి వ్రాసెను. ఫోర్డు, బ్యూక్, మున్నగు సుప్రసిద్ధ మోటారు కంపెనీలన్ని విమానాల యంత్రాలు తయారు చేయు ఫ్యాక్టరీలుగ మారిపోయినవి.

జర్మనీ ఆయుధ ఉత్పత్తి గురించి న్యూయార్కు టైమ్సు పత్రిక యిట్లు సూచించింది —

“రెండవ ప్రపంచ యుద్ధమునందు ప్రథమసారి జర్మను ఆయుధోత్పత్తి యిపుడు వెనుకపడింది. జర్మనీలో అంగబలం సైన్యానికి పరిశ్రమలకు తగినంత లేదు. సైన్యంయొక్క అవసరం నానాటికి పెరిగి పోతున్నది. రష్యాతో యుద్ధం జర్మనీలో గొప్ప మార్పు తెచ్చి పెట్టింది. రష్యాయుద్ధంలో మూడు తరాలకు సరిపోవునంత మంది జర్మను యువకులు యీ సరికి చనిపోయియుండురు. నేడు యుద్ధరంగ విశేషంగా విస్తరించి యున్నందున జర్మను సేనలను అంతటా యుంచుటకు ఎంతో ఎక్కువ సైన్యం కావాలి. మిత్రమండలి సేనలుగూడ 1914 కన్న యిపుడు చాల ఎక్కువగనుండి ఎక్కువ ఆయుధ పరికరాలు కలిగియు నున్నవి. జర్మను సైన్యం స్వదేశానికి అతిదూరం పోయి యుద్ధం చేయవలసియున్నది. అంతేకాక ఆక్రమించిన దేశాలలో ప్రజల నణచియుంచుటకు కొంత సైన్యం అచట విడచి పెట్టవలసియుంది.

జర్మనీలోయున్న పనిచేయగల పురుషుల సంఖ్య 20,000,000 లో ఎక్కువ ఉపయోగపడువారు 9,000,000 మంది సైన్యంలో నున్నారు. 1,500,000 మంది చనిపోవుటలో గాయపడుటలో జరిగెను. అనగా జర్మనీ రష్యాతో యుద్ధం ప్రారంభించినప్పటినుండి, జర్మనీలో ఆయుధోత్పత్తి కార్యాలకు సగంమందే మిగిలియుందు రన్న మాట.

**రష్యాకు బ్రిటిషు సహాయం.**

రష్యాకు ఇంగ్లాండునుండి సంతతధారగా ఆయుధాల సప్లై జరుగుచున్నది. ఇంగ్లండు నుండి రష్యాకుపోయే సామానులు సరిచూచు ఉద్యోగి స్టాఫ్ సార్జంటు చెస్నీగారు లండనుకు తిరిగివచ్చినపుడు యిట్లు తెలిపిరి —

ఇంగ్లాండు తయారుచేయుచున్న సరకులో మేలుసరకు రష్యాకు పంపబడుచున్నది రష్యాకు వచ్చిన టాంకుల ఉత్పత్తి తేదీలు చూడగా రెండు నెలల క్రిందట తయారయినవే కనబడినవి. అవి అంతవడిగా సముద్రాలు దాటించి రష్యా పంపగల్గినందుకు రష్యనులు చాల సంతసించి బ్రిటిషువారిని మెచ్చుకొనిరి. వాటిని దించుకొనుటకు రష్యనులు నాల్గు రాత్రింపవళ్లు పనిచేసిరి. అమెరికానుండి చమురుతో సహా విమానాలు, మోటారు లారీలు, టాంకులు వచ్చుటను నేను స్వయంగా చూచితిని. బ్రిటిషు టాంకులు రష్యా వచ్చిన ఎనిమిది రోజులలోనే పని ప్రారంభించినవనియు, అపుడు మాస్కోకు ప్రమాదం తప్పించబడెననియు, చస్నీగారు చెప్పిరి. తాము రష్యాలోనున్న నాల్గు నెలలలో సామాను దించుచునే యుంటిమి కాని ఒక్క రోజయినా తీరిక లేకుండె ననిరి.

“చివరకు విజయం తమదేయను మనోధైర్యం రష్యనులకు బాగాగలదు. జర్మనులు మాస్కోనగరం చేరువరకు వచ్చినపుడే యీ యేడే యుద్ధం గెలువ గలమని పలువురు రష్యనులు అనగా వింటిని” అని వేరొక సార్జెంటు హారింగు టనుగారు తెలిపిరి.

**రష్యనుల తిరుగు దాడి.**

రష్యనులు తిరుగుదాడి తీవ్రముగా కొనసాగించుచు లెనిన్‌గ్రాడు ప్రాంతములందు, మధ్యరంగమునందు మంచి విజయములను బడసిరి. “ముందుకు త్రోసుకపోవుట అంతవడిగ జరుగ లేదు కాని, జర్మనులు వెనుక నిల్వయుంచుకొన్న సైన్యాలనుగూడ రక్షణకొరకు పంపవలసినంత తీవ్రంగా రష్యను తిరుగుదాడి జరుగుచున్నది. దూర దూరము చెదరియున్న తమ శిబిరాలకు సప్లైలు అందజేయడానికి జర్మనులు విమానాలను ఉపయోగించవలసి వచ్చుచున్నది. జర్మనులు తిరిగి తీవ్రదాడి ప్రారంభించు లోపున చెదరియున్న జర్మను శిబిరాలన్ని రష్యనులు వశపరచుకొనలేరు. కాని వసంత ఋతువులో ఆ ప్రాంతాలు బురదగ నుండును. అది ఎంతవరకు రష్యా అశ్విక దళములకు తోడ్పడునో చూడవలసియున్నది.”

లెనిన్‌గ్రాడు, కాలినను మున్నగు ప్రాంతములందు తీవ్రమగు యుద్ధం యిపుడు జరుగుచున్నది రష్యనులు తమ స్థానములు నిలుపుకొని ఈ జర్మనులను తరిమివేసిరి చాల నష్టపరచిరి. జర్మనీనుండి విమానాలపై క్రొత్త సేనలు ఎక్కువగా వస్తున్నాయి. కాని వచ్చినవన్ని రాగానే రష్యనుల వలలోబడి నాశన మవుతున్నాయి.

**జర్మను విమాన నష్టం.**

జర్మను విమాన దళమునకు రష్యా చాల నష్టం కలిగించుచున్నది. గత శనివారంతో అంతమయ్యే వారమునందు 249 జర్మను విమానాలు నాశనమయినవి. రష్యను విమానాలు 77 మాత్రం పోయినవి. మరునాడు రష్యనులు మరో 25 జర్మను విమానాలను పడగొట్టిరి. మధ్యరంగమున కాలినిను ప్రాంతములందు 5 రష్యా ఫైటరు విమానాలు 30 జర్మను విమానాలను పడగొట్టినవి. నేల సైన్యాలుగూడ వాటికి తోడ్పడినవి.

* * *

**జపాను వెనుక పడింది.**

పశిఫికు ప్రాంతములందు జపాను అపుడే వెనుకబడింది. మీదబడి కొట్టే స్థితినుండి దెబ్బలు కాచుకునే రక్షణ స్థితికి వచ్చింది. జపాను నౌకాదళాధికారి యే యీ మాట నంగీకరించెను. అతడు “యుమూరి షిం భూమి” అను పత్రికయందు యిట్లు వ్రాసెను :—

“జావా పడిపోయినప్పటినుండి, యుద్ధం జపానుకి అంత అనుకూలంగా లేదు ఇపుడు జపాను రక్షించుకొనే స్థితికి వచ్చినట్లుంది ; ఇంగ్లాండు అమెరికా రాజ్యాలే దెబ్బకొట్టే స్థితిలో నున్నట్లుంది. పశిఫికులో శత్రువులు, యీ యేడాదిలోగా 10 ప్రత్యేక నౌకలపై సైన్యాన్ని తెచ్చి పోవాయి

న్యూజిలాండు, సామోవా మున్నగు స్థలములవద్దనుండి జపానుపై దాడిచేయనున్నారు.'' అని అతడు వ్రాసెను.

**ఆస్ట్రేలియా నుండి దాడి.**

జనరలు మాక్‌ఆర్థరుగారు, ఫిలిప్పైన్సులో నుండిన అమెరికను సేన నాయకుడు ఆస్ట్రేలియా, ఫిలిప్పైన్సు ప్రాంతములంతకు సర్వ సేనానిగా నియమింపబడినట్లు మార్చి 17 వ తేదిన ప్రకటింపబడెను. దీనిబట్టి శత్రువుపై దాడి చేయుటకు ఆస్ట్రేలియా కేంద్రస్థానంగా చేయబడునని తెలియగలదు. ఫిలిప్పైన్సు రక్షణ ఏర్పాటులన్ని పూర్తి చేసుకొని వచ్చుటకు మకార్థరుగారికి మూడు వారాలు పట్టింది ఆధునిక యుద్ధపద్ధతి బాగా ఎరింగిన మేజరు జనరలు వెయిను రైటుగారు ఫిలిప్పైన్సులో అమెరికా సేనల నాయకుడుగ నియమించబడెను. ఫిలిప్పైన్సు రక్షణ ప్రయత్నం తగ్గించలేదు. అమెరికనులు ఫిలిప్పైన్సు దీవులు విడచి పోతున్నారని అక్షరాజ్యాల ప్రచారమును అధ్యక్షుడు ఆదినే ఖండించివేసెను.

న్యూగినీ, న్యూఇంగ్లండు, టిమూరుదీవులందు తమ ఉనికి దిట్టంచేసుకొని అటనుండి దాడిచేయాలను జపాను ఉద్దేశాలను, రాయలు విమాన దళంవారు పడగొట్టిరి. గతవారం వారి విమానాలు సలమావ, ఫినుషాఫెను, రేబాలులందు బయలుదేరనున్న జపాను నౌకలపై దాడి జరిపినవి. న్యూగినీ ఈశాన్య భాగాన్నాలాసాలమావపై యింకోదాడి జరిపినవి. ఎనిమిది శత్రునౌకలుముంచబడుటో, దెబ్బతినుటో జరిగెను. విమానాలు దిగే మైదానాలు, విమానాలు చెడగొట్టబడినవి. టిమూరునందు డేలిపురమున శత్రువిమానాశ్రయంపై బ్రిటిషు విమానాలు బాంబులువేసినవి. న్యూగినీలో మువనుగల్పునందు ఆస్ట్రేలియా సైన్యాలు దాగొని గొరిల్లా యుద్ధంచేయుచున్నవి. ఇదంతా జపానుకి భీతి కలిగించుచున్నది.

మూర్సుబీరేవునందు, తర్సుడేదీవిపైని, డార్విను రేవుపైని శత్రువులు తరుచు విమానదాడి చేయుచున్నారు. న్యూగినీ వాయవ్య తీరాన్న, విమానాశ్రయం స్థాపించుకోవాలని శత్రువు తలంపు. కాని మిత్రమండలి విమానాలా చోట దాడిచేసి ఆశాభంగం కలిగించినవి.

ఆస్ట్రేలియాలో ప్రజాభిప్రాయం పూర్తిగ యుద్ధంలో దిగిపోవుటకు అనుకూలంగా మారింది. "మేము సిద్ధంగానున్నాము, దెబ్బకు దెబ్బకొడతాము'' అని కర్టిను ప్రధాని 14 వ తేదినుడివెను. ఆయుధాలమంత్రి ఫోర్డిగారు "ఇకముందు ఆస్ట్రేలియానే ముందుదాడి ప్రారంభించు'' ననిరి. ఇంకోమంత్రి కోట్సుగారు జపాన్ని కమ్చీతోకొడతామన్నారు. ఆస్ట్రేలియా ఏరీతిగా యుద్ధానికి తయారవుతున్నదో యీ ప్రకటనలవల్ల తెలియగలదు. ప్రతివానిని ఏదో ఒక పనికి నియమించుటకు ఆస్ట్రేలియా మంత్రివర్గానికి అధికారంగలదు. శలవులన్ని రద్దుచేయబడ్డాయి. వస్తువులన్నిటిపై కంట్రోలు నియమాలు ఏర్పాటు చేయబడ్డాయి. ఆస్ట్రేలియా యుద్ధానికి తయారయింది. అమెరికా దానికి తగిన సహాయం చేయడానికి శక్తివంచన లేక పాటుబడుచున్నది.

**బర్మా రంగంలో మాంద్యం.**

బర్మా యుద్ధం కొంచెం మందగించింది. శత్రువు క్రొత్తగ ఆక్రమించిన ప్రాంతాలలో స్థావరమేర్పరచుకొనుటలో తీరిక లేకయుంటే, మన సేనలో క్రొత్తదాడి నెదుర్కొనుటకు సిద్ధమగుచున్నవి. చీనా, సేనలు బర్మా రక్షణకు తోడ్పడుచున్నవి. క్రొత్త చీనా సేనలు వస్తూవుంటే బర్మీయులు ఆనందంతో తోరణాలుకట్టి స్వాగతమిస్తున్నారు. చీనా సేనలు మంచి శిక్షణ కల్గి, జపానువారి లోతుపాతులెరింగి వారిని కొట్టాలనే ఉత్సాహం ఎక్కువగ కలిగియున్నవి. బ్రిటిషు, చీనా సేనానాయకులకు మంచి అన్యోన్యసహకారంగలదు

శత్రువశమయిన మోల్మేను రేవుపై బ్రిటిషు విమానాలు బాంబులువేసి పిప్పి చేయుచుండ బర్మాలో శత్రు విమానాల జోరంతగా లేదు. మన విమానబలం ఎక్కువయినదనుటకు యిదే నిదర్శనం. "బర్మా యుద్ధం ప్రారంభమయినప్పటికన్న మన విమానశక్తి యిపుడు చాల ఎక్కువగా నుంది కనుక బర్మాను మనం నిలుపుకోగలమను నమ్మకంవుంది'' అని సర్ పియర్సిగారన్నారు.

బర్మా క్రొత్త సర్వసేనాధికారియగు జనరలు అలగ్జాండరుగారు, రంగూను విడచివచ్చుటకు కారణం చెపుతు, శత్రువుల సంఖ్య చాల ఎక్కువగ నుండుటచేతను, రక్షణకార్యములకు నేల సదుపాయంగా లేనందునను, ఉత్తర బర్మాను, చమురుగనులను రక్షించుకొనుటకై వెనుకకు వచ్చుటతప్ప వేరుమార్గం లేకుండె ననిరి.

శత్రువు యిక ముందు నాల్గుమార్గాల పోవచ్చుననిరి; చమురుగనులవైపు రావచ్చును; అస్సామునుండిగల సప్లయి మార్గమును నిరోధించుటకు ప్రయత్నించవచ్చును; ఇరావడీ, టూంగూనదీ లోయలగుండా మాండలేవైపు దాడి రావచ్చును. చీనాకుగల మార్గములన్ని మాండలే నగరం మీదుగానే పోతాయి. లేదా దక్షిణ షాను సంస్థానములందున్న చీనావారికి మనకు సంపర్కం లేకుండనిరోధం కలిగించవచ్చును.

బర్మా యుద్ధంలో అనేక ఘనకార్యములు పేర్కొనదగ్గవి ఉన్నాయి. అందు ముఖ్యమయినది వేనిచంగ్ అను రైల్వే స్టేషనువద్ద రైల్వే పనివారుచేసిన యుద్ధం. వారు రాత్రంతా జపాను సేనలతో యుద్ధం చేయుచు, మన పెద్దసేన తప్పించుకొని పారిపోవుటకు అవకాశం కలిగించిరి. ఇంకొకటి; ఒక భారతీయ హవిల్దారు కూలీవేషంలో, జపాను సేనలకు త్రెంచి గోతులు త్రవ్వుకూలి జనంలో కలసిపోయెను. అటనుండి ప్యేంగిను నగర రక్షణకు శత్రుసేనలు ఏ ప్రకారం ఎంతబలం ఉంచబడినవో తెలుపు కాగితాలన్ని పట్టుకొనివచ్చెను.

---

# ఆస్ట్రేలియాపై విమాన యుద్ధం.

## బర్మా యుద్ధంలో రెండో ఘట్టం.

బర్మా యుద్ధంలో రెండో ఘట్టానికి వచ్చితిమి రంగూను నుండి బ్రిటిషు సేనలు వెడలిపోవుటతో మొదటి ఘట్టం ముగిసింది ఇపుడు జపాను సేనలు ఉత్తరంగా పోవుచున్నవి. చీనాకు సరకు గొంపోవు బర్మా రోడ్డును తెగగొట్టుటకు మధ్య బర్మావైపు పోతున్నవి. రెండు పెద్ద శ్రేణులుగా జపాను సేనలు పోవుచున్నవి. ఒకటి సిట్టాంగు లోయంగుండా సూటిగా మాండలేవైపు పోతున్నది. మాండలే ఉత్తర బర్మాకు ముఖ్య పట్టణము. బర్మా రోడునకు పడమరకొసనున్న లాషియో రైల్వే

స్టేషనుకు మాండలేకు రైలుమార్గం కలదు. రెండవ సైన్యం ఇరావడీనది ననుసరించుకొని ఉత్తరంగా పోతున్నది ఈ నది సిటాంగునదితో జంటగనే పారుచున్నది. కాని ఈ మార్గంలో ప్రోము దాటినాక రైలు మార్గం లేదు ప్రోము రంగూనుకు 160 మైళ్లు దూరంలో వుంది. ఈ రెండు నదుల లోయల మధ్య పిగుయోమా కొండ లడ్డంగా నన్నవి. మధ్య అడవి ప్రదేశం. అడవంటే జపానువారికి చాల యిష్టమే. కాని యీసారికి అడవిలో యుద్ధం చేయడంగూడ బ్రిటిషు సేనలు భారతీయ సేనలు బాగా నేర్చియున్నవి. ముమ్ముందు బర్మా యుద్ధం మాండలే ప్రోము రెండు ముఖ్య నగరములనుండి పోవు రోడ్ల ననుసరించియుండు ననుటకు ఎట్టి సందేహం లేదు. ప్రక్కలనుండి, వెనుకనుండి దొంగతనంగా వచ్చిపడే నేర్పు గూడ జపాను సేనలకు కలదు. కావున పైన దెలిపిన మార్గాలనేగాక, ప్రక్కతావులనుకూడ జాగ్రతగ రక్షించుకోవ సియుండును.

మాండలేకు పోవు రోడునకు అడ్డంగా టోంగూవద్ద (మాండలేకు 190 మైళ్లు దక్షిణం) సామ్రాజ్య సేనలు, చీనా సేనలు కాపలా కాచియున్నవి. వారు తీర్చి సందులేకుండా నిలచియుండలేదు. రక్షణ శిబిరాలుగూడా నిర్మింపబడియుండ లేదు. అయినను జపాను సేనల నేరును నిరోధించుటకు తగిన కట్టుదిట్టములు చేయబడినవి. ప్రోము రోడు వీరున్న చోటికి కొద్ది మైళ్లు దక్షిణంగావుంది. టోంగూపురం తీసుకున్నామని శత్రువులు ప్రకటించుట వట్టి బూటక ప్రచారమని లండనునుండి ప్రకటించబడెను. టోంగూకు దక్షిణాన 30 లేక 40 మైళ్లు దూరంలో ప్యూవద్ద శత్రు సేన లున్నవి ఈ ప్రాంతంలో బ్రిటిషుసేనలు, భారతీయ సేనలు కలసి చీనా సేనల సహకారంతో లెఫ్టనెంటు కర్నలు స్టిలువెల్‌గారి నాయకత్వమున పనిచేయుచున్నది. మిత్రమండలికి యిప్పటికీ విమానాధిక్యత కలిగెను. రాయలు దళ వైమానికులు, భారతీయ వైమానికులు, అమెరికా వాలంటీరు వైమానికులు తరచుగా శత్రువిమాన కేంద్రాలపైకి దాడివెడలి కదలలేకుండాకొట్టిరి. ఉత్తర బర్మాయందున్న విమానాశ్రయాలు మన వసమందుండునంత కాలంమనకే విమానాధిక్యత ఉండగలదు.

## తూర్పు దీవులలో యుద్ధం.

పశిఫికు ప్రాంతములందు యితర చోట్లగూడ విమానయుద్ధాలే ఎక్కువగ జరుగుచున్నవి. ఫిలిప్పైన్సు రంగములందు మాత్రము యింకోవిధంగా జరుగుచున్నది. అచట మకార్థరుగారిస్థానే సేనానాయకుడుగనున్న జనరలు వైనురైటుగారు, లొంగిపోవలెనని కోరిన జపాను సందేశమును నిర్లక్ష్యంచేసి, కోరిగడరు కోటనుండి బటాను ద్వీపకల్పంనుండి తన సేనను తొలగించుటకు శత్రువులుచేయు యత్నములన్ని తిరుగగొట్టెను. అచటనున్న అమెరికా సైన్యం ఫిలిప్పైనుల సైన్యం జపాను సైన్యంకన్న చాల తక్కువైనప్పటికీ, చిట్టచివర ఒకడు మిగిలేవరకు యుద్ధం చేయుటకే నిశ్చయించినవి. ఫిలిప్పైన్సు పూర్తిగ వశపరచుకొనుటకు జపాను చాలసైన్యాన్ని నష్టపోవలసి యుండును.

న్యూ గినీలో కొన్నిస్థానా లాక్రమించుటకు తీవ్రయుద్ధం జరుగుచున్నది. ఈ దీవి యింకా పూర్తిగ జపానువశం కాలేదు. ఈ దీవిలో స్థావరమేర్పరుచు కొన్నచో శత్రువు ఆస్ట్రేలియాపై దాడిచేయుటకు ఊతవాగా యుండును. న్యూగినీ దక్షిణ తీరాన్న ఆస్ట్రేలియాకు చేరువగనున్న మార్సిబీరేవుపై తరుచు జపాను బాంబులు వేసెను. కాని జపాను విమానాలు స్థిరనివాసమేర్పరుచుకున్న న్యూబ్రిటను కేంద్రమగు రీబాలుపైని, లాసాలమను అను రేవులవద్ద నావలపైని బ్రిటిషు విమానాలు తీవ్రమగు దాడిచేసి చాలనష్టం కలిగించినవి. అమెరికా "కోట" బాంబరు విమానాలు చాల జపాను యుద్ధ నౌకలను వర్తక నౌకలను ముంచినవి. జపాను నౌకలు అతిదూరంగానున్న స్వదేశంరేవులకు పోయి మరమ్మత్తు కాలేవు, కనుక విశాలమగు పశిఫికు మహాసముద్ర యుద్ధమునందు విమానశక్తియే అత్యంత ప్రధానమైనది, అవసరమయినదని యిపుడు రుజువయింది.

జపాను నేల సైన్యాలు, నౌకాదళాలు కూడ యిపుడు ఆత్మరక్షణ కార్యంలో శ్రద్ధవహించుచున్నవని జపాను నౌకాదళ ఉద్యోగి యొకడు ఒప్పుకొనెను. లీ, మార్సుబా రేవులనుండి బయలుదేరదలచిన జపాను సేనలు బయలుదేరనేలేదు. జనరలు మకార్థరుగారు ఫిలిప్పైను వీడుడు ఆస్ట్రేలియా నాధిపత్యం వహించినందున ఆస్ట్రేలియా నేప్రజలంతా ఉప్పొంగి, శత్రువు హతమార్చుటకు నడుంబిగుస్తున్నారు. ఆస్ట్రేలియా యుద్ధ మంత్రివర్గంతో కూడ మాకార్థరుగారు శత్రుదేశ దాడి విధానం ఆలోచించుచున్నారు. ఆస్ట్రేలియనులు తమపూర్వీకులవలెనే, పారిపోవు భీరువులు కారు. ఉత్తర రేవులపై శత్రువిమాన దాడులు వారి పట్టుదల నెక్కువచేసినవి. ఆస్ట్రేలియా నేలను కాలుపెడితే శత్రువును సముద్రంలోకి తోసేడానికి సిద్ధంగా ఉన్నారు. అందుచే జపాను సేనలు యించుకతమాయించి, ఆస్ట్రేలియాపై వచ్చేలోగా ఉత్తరానయున్న దీవుల నాక్రమించుటకు ఎక్కువ శ్రద్ధవహింపవచ్చును. అందుకే సోలమను దీవులపై దాడి చేస్తున్నారు. అమెరికానుండి ఆస్ట్రేలియాకు నౌకలు రాకుండా అడ్డుటకు మధ్యనున్న సామవాను మున్నగు దీవులను పట్టుకొన జూతురు. ఈ మార్గములు శత్రువశం కాకుండుటకే అమెరికా శ్రద్ధవహించుచు, ఆస్ట్రేలియా న్యూజిలండులకు ఎక్కువ సైన్యం సరకు సహాయంగా పంపుచున్నది.

అందుకనే జావా వశమయిందగ్గరనుండి యుద్ధం తమకంత అనుకూలంగాలేదని జపానునౌకాదళ నాయకుడు హిరాడిగారనుటలో అర్థంలేకపోలేదు. జపాను యిపుడు దెబ్బలు తప్పించుకోవలసిన స్థితికివచ్చిందని అతడుఏడుస్తున్నాడు. ఈ యేడాదిలోగా అమెరికా, ఇంగ్లాండు సంయుక్తరాజ్యాలు క్రొత్త సేనలను నౌకలను తెచ్చి జపాను సముద్ర మార్గాలను అరికట్టగలవని కూడ అతడు బెంగపడుచున్నాడు. 1943లో అమెరికా పరిశ్రమలందు 185,000 విమానాలు, 120,000 టాంకులు, 55,000 ఫిరంగులు, యితరఆయుధాలు తయారుచేయుటకు అధ్యక్షుడు నిర్ణయించుట విని హిరాడిగారు యింకెంత బెంగపడతారో ?

# ఎలిజబెతు రాణి—కనడా కార్మికులు.



అడవులు కొట్టి కలప చేయుటయందు నేర్పరులగు కనడా పనివారు స్కాట్లండువచ్చి పని చేయుచున్నారు. బ్రిటిషు దేశపు రాణి ఎలిజబెతువారిని స్కాట్లండులో రాజమందిరమునందు వీరిని చూచుచున్నది.

---

# రష్యా జాతర — నాజీ బలి.

మన హిందూమతం ప్రకారంగా అందరూ సుఖంగా ఉండాలని మనమందరమూ కోరుతూవుండాలి. అందుకనే "సర్వేజనా స్సుఖినోభవంతు" అని శుభవాక్యం పలుకుతూ వుంటాము. ఆవిధంగా ఆలోచిస్తే, జర్మనులూ సుఖంగానే వుండాలి. రష్యనులూ సుఖంగానే వుండాలి. భారతీయులూ సుఖంగానే వుండాలి. బ్రిటిష్‌వారూ సుఖంగానే వుండాలి. జపానువారూ, చైనావారూ సుఖంగానే యుండాలి. ఉండవద్దని ఎవరూ అనరు. కాని, ఆ సంకల్పం అందరికీ సమానంగా వుండాలి. ఈ మాటకు అర్థమేమిటంటే, ఎవరి హద్దుమేరలలో వారు వుండాలి. అంతే కాదు, ఈ ప్రపంచంలో మనకు వున్నంతకాలమూ ఇంకొకరితో మనకు పని లేదనిగాని, ఇతరులతో మనకు సంబంధంలేదనిగాని, లోకాన్ని నిర్లక్ష్యంచేసి ఏకాకిగా మనము ఉండగలమనిగాని వాదించుటకు వీలులేదు. ఒకరినొకరు ఆశ్రయించుకొని పరస్పర సహాయం పొందుతూ జీవించక తప్పదు. ఇండియాలో పండే ప్రత్తి ఇంగ్లాండుకు కావాలి. ఇంగ్లాండులో తయారయ్యే యంత్రాలు ఇండియాకు కావాలి. చొక్కాలు కుట్టించుకునేవాళ్లమూలంగా కుట్టుపనివాడు జీవిస్తాడు. కుట్టుపని వాని సహాయం చొక్కాలు తొడుగుకొనేవాళ్లకు కావాలి. ప్రతివాడూ ప్రతిపనీ యీ ప్రపంచంలో చెయ్యలేడు. కనుక, అన్ని దేశాలవారూ యీ ప్రపంచంలో అన్యోన్యాశ్రయంగా సుఖంగా జీవిస్తూఉండక తప్పదు. ఇది సృష్టి రహస్యం. ఇది ప్రకృతి ధర్మం. ఇది భగవంతుని సంకల్పం. ఒక్క ఉదాహరణం చూడండి:—సూర్యచంద్రాదులు మొదలైన గ్రహాలన్నీ ఒకదాని నింకొకటి ఆకర్షిస్తూ ఉన్నాయి. ఈ పరస్పరాకర్షణవల్లనే, ఆయా గ్రహములన్నియూ అనంతమైన ఆకాశంలో తమ గతులు తప్పకుండా, తమ సంచారచక్రములమీద కాలమానం తప్పకుండా సంచరిస్తూ, ఒకదానితో ఇంకొకటి డీకొట్టుకొనకుండా క్షేమంగా, భద్రంగా ఉంటున్నాయి. మనుష్యులుకూడా యీ సృష్టి రహస్యం గ్రహించి తమతమ గతులు తప్పకుండా, తమతమ హద్దుమేరలలో సంచరిస్తూ, వ్యవహరిస్తూ, పరస్పరాశ్రయంగా, అన్యోన్యాకర్షణవల్ల జీవిస్తూఉంటే, "సర్వేజనా స్సుఖినోభవంతు" అనే వాక్యం అక్షరాలా అమలులో ఉంటుంది. ఆచంద్రతారార్కంగా స్థిరమైన లోకశాంతి ఏర్పడుతుంది.

గ్రహాలన్ని ఎట్లా నియమబద్ధంగా ఉంటున్నాయో, అదే విధంగా వివిధరాజ్యాలవారు నియమబద్ధంగా, ఒక్క గ్రహకూటంగా, సమష్టికుటుంబంగా ఉంటూఉండడం లోకశాంతికి చాలా అవసరం. ఈ విషయమును, బ్రిటిష్‌వారున్నూ, అమెరికావారున్నూ ఇతర మిత్రరాజ్యాలవారున్నూ గత యిరోపా సంగ్రామం ముగిసినపిమ్మట గ్రహించారు. అందుకోసం "నానాజాతిసమితి" అనేదానిని ఆ యుద్ధానంతరం ఏర్పాటుచేసి ప్రతిష్ఠించారు. కాని, యీ అంతర్జాతీయ కూటముయొక్క ప్రభావం ఎటువంటిదో బోధపడవలెనంటే ఈ అంతర్జాతీయ పీఠమునకు అందరూ కలిసి ప్రాణప్రతిష్ఠ చెయ్యాలి. అందరికీ దానియందు గట్టినమ్మకం ఏర్పడినప్పుడే, దానియందు మహత్తు ఏర్పడుతుంది. ఇటువంటి అంతర్జాతీయ పరస్పరాశ్రయ పద్ధతిని ప్రపంచ శాంతి నిమిత్తమై ప్రతిష్ఠించినది ఎవరు? దానికి మూలపురుషులై ధర్మకర్తలై నడుముకట్టుకొని నిలువబడిన ధర్మప్రతిష్ఠాపకులెవరు? బ్రిటిష్‌వారే దానికి యాజకులై పనిచేసారు. వారే పట్టుదలగా యీ ధర్మసంస్థాపనా పీఠమునకు పూజారులై పనిచేసారు.

ఏమిచేస్తే ఏమి లాభం? ఇతరదేశాలవారికి యింకా అంతటి జ్ఞానపరిపక్వం కాలేదు, అంతర్జాతీయ ధర్మ

నియమములను శిరసావహిస్తేనే తమకుకూడా క్షేమలాభైశ్వర్యములు స్థిరంగా ఉంటాయనే జ్ఞానోదయం పూర్తిగా కొన్నిరాజ్యాలవారికి కలుగలేదు. అంతర్జాతీయ ధర్మములనేవి అందరికీ శిరసావహింపదగినవై యుండాలి. ఒక రాజ్యంతో ఇంకోరాజ్యం వ్రాసుకొన్న ఒడంబడికలను ఉభయరాజ్యాలవారూ శిరసావహించాలి. ఆ ఒడంబడిక షరతులను ఉల్లంఘించకూడదు. ఈ తత్వం పూర్తిగా తనకు పనికిరాదని తన ప్రవర్తనవల్ల ఋజువుచేశాడు హిట్లరు. ఇతరరాజ్యాలకు హిట్లరు వ్రాసియిచ్చిన ఒడంబడికలను, హిట్లరు తనంతట తానే తృణీకరించాడు. ఒక్క పెద్ద ఉదాహరణం చూడండి: ఈ యుద్ధప్రారంభమందు రష్యాతో స్నేహంగా ఉంటాననిన్నీ, రష్యామీదకు తాను కత్తికట్టి యుద్ధానికి రాననిన్నీ ప్రమాణపూర్తిగా కాగితం వ్రాసి యిచ్చాడు. ఆఖరుకు క్రిందటి సంవత్సరం హిట్లరు ఏమి చేశాడు? అకస్మాత్తుగా రష్యామీదకు తన సేనలను ఉసికొల్పి, తాను వ్రాసియిచ్చిన ప్రమాణపత్రమును తానే చించి పారవేసి, రష్యామీదకు దండయాత్ర సాగించాడు.

అయితే, రష్యాతో ఒడంబడిక కాగితమును హిట్లరు వ్రాసుకొనడం ఎందుకు సంభవించింది? ఆ కాగితం వ్రాసి యిచ్చినప్పుడే, రష్యాకు ద్రోహంచెయ్యవలెననే దురుద్దేశంతో వ్రాసియిచ్చినాడా? ఈ విషయం కొంచెం పరిశీలించినట్లయితే, హిట్లరుయొక్క అధర్మప్రవర్తన పూర్తిగా బోధపడగలదు. పోలెండుమీదకు హిట్లరు తన సేనలను నడిపించుటకుపూర్వం, మునుముందుగా రష్యాతో సఖ్యతగా ఉంటానని చెప్పి రష్యాకు హిట్లరు మైత్రిపత్రం వ్రాసి యిచ్చాడు. పోలెండుతో తాను సంకల్పించిన యుద్ధం నిర్విఘ్నంగా కొనసాగించుటకోసం, రష్యాకు పోలెండులో భాగం యిస్తాననికూడా మొక్కుకొన్నాడు. రష్యా అంటే హిట్లరుకు మొదటినుంచీ అపరిమితమైన భయం. రష్యాలో ఉన్న సామ్యవాద పద్ధతిని సర్వనాశనం చేస్తానని హిట్లరు అదివరకే అనేకసంవత్సరాలనుంచీ ఘంటాపథంగా ఘోషించాడు. ఆ ప్రకారంగా తన గ్రంథాలలో వ్రాశాడు తన ఉపన్యాసాలలో గర్జించాడు. రష్యాను హిట్లరు ద్వేషించాడు. రష్యాలోని సామ్యవాదపద్ధతి పేరుచెప్పితే తనకు దేహం దహించుకొనిపోతుంది అనేవాడు. రష్యా రాజ్యం చాలా బ్రహ్మాండమైన రాజ్యం. అంత విస్తారమైన ఏక ఖండమైన రాజ్యం ప్రపంచంలో ఇంకొకటి లేదు. రమారమి మూడువేలమైళ్ల వెడల్పుగల రాజ్యం అది. అయిదారువేలమైళ్ల పొడుగుగల రాజ్యం అది. ఇంతటి బ్రహ్మాండమైన రాజ్యం ఐరోపా ఖండంలోనుంచి ఆసియా ఖండంలోనికి విస్తరించివుండడం హిట్లరుకు పెద్ద పెనుభూతంగా కన్పించింది. తాను ఏదైనా దిగ్విజయయాత్ర సాగించడానికి పూనుకుంటే, రష్యాను జయించడం తనకు సాధ్యమయ్యే పని కాదని హిట్లరుకు గుండెలో రాయిపడినట్లుగా ఉంటూనే ఉంది. రష్యాయెడల హిట్లరు ఎంత ద్వేషం ప్రకటిస్తూ ఉన్నాడో, రష్యా అంటే హిట్లరుకు అంత భయం ఉంటూనే ఉన్నది. రష్యా అంటే హిట్లరుకొక కాళికాదేవిగా, సదా సర్వకాల సర్వావస్థలయందూ కళ్లముందు కన్పిస్తూనే ఉంది. అందువల్లనే హిట్లరు యుద్ధం ప్రారంభించేముందు, తన దిగ్విజయయాత్రకు యీ రష్యారాజ్యం విఘ్నములు కల్పించగలదనే భయం పుట్టింది. "నీకు నేను దాసుడనై ఉంటాను. నీతో నేను సఖ్యతగా ఉంటాను" అని రష్యాకు హిట్లరు ఆదిశక్తికి మొక్కుకున్నట్లుగా ముందుగా మ్రొక్కుకొని, అటు పిమ్మట యుద్ధం ప్రారంభించాడు. యుద్ధం సక్రమంగా జయప్రదంగా కొంతవరకు సాగిన తర్వాత, తనకు ఆపత్తు తొలగిపోయిందనుకొన్నాడు. ఆపత్కాలంలో తాను మొక్కుకొన్న మొక్కులన్నీ ఇక చెల్లించవలసిన అవసరంకూడా లేదనుకున్నాడు. ప్రమాణపూర్తిగా తాను వ్రాసియిచ్చిన పత్రాలు రద్దుచేస్తానన్నాడు. తన మాటమీద తానిక నిలువబడ నక్కరలేదనుకొన్నాడు. మాట సత్యం అనేది లేకపోతేమాత్రం, రష్యా మనలను ఏమి చెయ్యగలదనే ధిక్కారంతోను, అహంకారంతోను విజృంభించాడు. "మాట సత్యం లేకపోతే మనకు వచ్చిన ప్రమాదమేమిటి? ద్రోహంచేస్తే వచ్చిన పాపమేమిటి? ఈ పాపకార్యానికి మనలనిక దండించగలవాడెవడు? నేనే సర్వసమర్థుడనైనప్పుడు, పాపమేమిటి? పుణ్యమేమిటి? ధర్మమేమిటి? అధర్మమేమిటి? పత్రాలులేవు, గిత్రాలు లేవు-రష్యామీదనే దండయాత్రసాగిస్తానిక చూడు" అన్నాడు. ఈ అక్రమం యావత్తూ రష్యాచూచింది. "నీవు నాకు ప్రమాణపూర్తిగా వ్రాసియిచ్చిన పత్రములన్నింటినీ, అపవిత్రం చేశావు. నీ అక్కర తీరేవరకు నా యెదుట మొక్కుకొన్నావు. ఇప్పుడు నన్నుకూడా లెక్కచేయనని అంటున్నావు. కనుక నీపాపం పూర్తిగా పెరిగింది. నీ ధర్మానికి నీవే ఆహుతికావాలి. రష్యా రాజ్యానికి జర్మనులు బలికావాలి. నిన్నే నేను విరుచుకొని తింటాను నీ పాపం బ్రద్దలయ్యే కాలం వచ్చింది." అని రష్యా కండ్లెర్రచేసింది. కత్తి పైకెత్తి నిలువబడింది, కాళికాదేవి లాగున.

రష్యావారి జెండా ఎర్రజెండా అది రక్తవర్ణపు జెండా. ఎర్ర జెండా చేతబట్టిన రష్యా సేనలను ఎర్రసేనలంటారు. ఆదిశక్తియొక్క రక్తవర్ణపు లాంఛనమే అది. రష్యసేన బ్రహ్మాండమైనది. దాదాపుగా రెండు మూడుకోట్ల సైన్యం అది. అంతటి బ్రహ్మాండమైన రష్యను సైనికబలాన్ని హిట్లరు ధిక్కరించాడు. "స్టాలిన్" అనే రష్యామాటకు ఉక్కుమనిషి అని అర్థం. అటువంటి చెక్కుచెదరని ఉక్కుముక్కవంటి రష్యను శౌర్యంకూడా లెక్కచేయనని హిట్లరు ధిక్కరించాడు. మూడు మాసాలలో రష్యాను ముక్కలు చెక్కలు చేస్తానని ప్రతిజ్ఞచేసి యుద్ధం ప్రారంభించాడు. ఆఖరుకు ఆరు మాసాలవరకు యుద్ధంచేసి అక్కడి మంచుగడ్డలలో చిక్కుకొన్నాడు. శీత కాలంలో అక్కడి చలికి కదల్లేక దిక్కుమొక్కులేకుండా ఎక్కడి జర్మను సేనలు అక్కడే ఆహుతి అయినాయి. చాలామంది జర్మను సైనికులూ, జర్మను సైనికాధికారులూ, లెక్కకు మిక్కిలిగావున్న రష్యనులకు ఖైదీలుగా చిక్కుకొన్నారు.

## జర్మనుల ఆహుతి.

రష్యనులకు యుద్ధఖైదీలుగా చిక్కుకొనియున్న జర్మని సైనికాధికారులు ఇప్పుడు యీ క్రింద విధంగా ప్రకటన చేస్తున్నారు. జర్మనీలో ఉన్న యితర జర్మను సేనలకు బుద్ధి చెప్పుతూ యీ క్రింది విధంగా విన్నవిస్తున్నారు:—

"జర్మను సైనిక సోదరులారా! యిప్పుడైనా కళ్లు తెరవండి. మామాటవినండి. హిట్లరు మిమ్ము మన్ను కానకుండా, కన్ను మూసికొని, రష్యాపై ధ్వజమెత్తి లక్షలకొలది జర్మను సైనికులను రష్యాలో ఆహుతి చేశాడు. ఇప్పుడైనా మించిపోయినదిలేదు. మీరైనా వివేకం కలవారై హిట్లరును అధికారపదవిలోనుండి తొలగించండి. హిట్లరుమాట మీరు లక్ష్యం చేయకండి. గౌరవప్రదంగా రష్యాతో జర్మనీ సంధి చేసుకొనడమే వివేకమైన ఉత్తమమైన పద్ధతి."

జర్మనుసైనికులు లక్షలకొలదిగా రష్యాయుద్ధంలో ఆహుతియైనమాట నిజం. అది ప్రత్యక్షవిషయం. ఇన్నిలక్షల జర్మను సేనను యీవిధంగా రష్యాలో హిట్లరు బలియిచ్చుచున్నందుకు జర్మను సైనికాధికారులకు హిట్లరుమీద ద్వేషం కలిగిం

దంటే, అందులో చిత్రవిషయ మేమీలేదు. గత అక్టోబరు మాసంలో మాస్కో నగరాన్ని ముట్టడించుటకు జర్మను సేనలను పోనివ్వవలసినదని జనరలు వాన్ బ్రాకిష్ అను జర్మను సేనాధిపతికి హిట్లరు ఆర్డరు ఇచ్చాడు. ఈ ఆర్డరు ప్రకారం మాస్కో నగరంమీదకు దండెత్తడం తమకు ఎంతమాత్రం యుక్తంగా కన్పించుటలేదని బ్రాకిష్ సేనానియున్నూ, ఇతర జర్మను సేనానులున్నూ హిట్లరుకు సలహాయిచ్చారు. కాని, మూర్ఖుడైన హిట్లరు తనమాట ప్రకారమే జరుగవలెనన్నాడు. వాన్ బ్రాకిష్‌గారు తమ శక్తివంచన లేకుండా జయప్రదంగా జర్మను సేనలను మాస్కో నగరం సమీపంవరకూ నడిపించారు. కాని, మాస్కోను ముట్టడించడం సాధ్యంకాలేదు. "మాస్కో ముట్టడిస్తే చూస్కో మాదెబ్బ" అని రష్యను సేనలు అగ్నివర్షం కురిపించాయి. అంతటితో, వచ్చినదోవనే బుల్లి జర్మను సేనలు వెనుకకు 250 మైళ్లు వచ్చాయి.

ఇప్పుడు తిరిగీ రష్యాపై యీ ఆవేశంగిలో విజృంభిస్తానని హిట్లరు అంటున్నాడు. తిరిగి వాన్ బ్రాకిష్‌గారితో హిట్లరు సంప్రతిస్తున్నాడు. రష్యాను యీ దెబ్బతో హతంచేస్తానని అంటున్నాడు. కాని, తానే ఆహుతికాక తప్పదు. రష్యాతు జాతర చేస్తానంటున్నాడు. కాని, తన నాజీసేనలనే హిట్లరు బలి యివ్వకతప్పదు. రష్యాతో యుద్ధం ప్రారంభించడం తన జీవితకాలంలో తాను తలపెట్టిన బ్రహ్మాండమైన కార్యమని హిట్లరే ఒప్పుకొని స్పష్టంగా చెప్పియున్నాడు. కనుక హిట్లరుకు బ్రహ్మాండమైన అది శక్తివలె కన్పించుచున్న యీ రష్యా, హిట్లరుయొక్క అంత్యదశకే కారణభూతమవుతుంది. రష్యాయొక్క వీరావేశమునకు, తోడుగా, బ్రిటిషువారున్నూ, అమెరికావారున్నూ ఆయుధాలు సప్లయిచేస్తున్నారు. ఓడలమీద నిరంతరంగా టాంకులు, మరఫిరంగులు, ఫిరంగి బండ్లు, వస్త్రాలు, శస్త్రాలు వగైరా సమస్త సామగ్రులు రష్యాకు చేరుచున్నవి. "అమెరికానుండి మోటారు లారీలు, టాంకులు నిరంతరంగా రష్యాకు చేరుట నేను చూచినాను" అని రష్యానుంచి వచ్చిన సైనిక శాఖాధికారి యగు సార్జంటు చెస్నీగారు అన్నారు. చైత్రమాసాంత్యమునకు హిట్లరు తిరిగీ యుద్ధయాత్ర ప్రారంభిస్తే, విష వాయువులు వగైరా ప్రయోగిస్తాడని అనుకుంటున్నారు. ఈ దుష్కర్మలతో, యీ అధర్మయుద్ధంతో రష్యాను తుద ముట్టించగలనని అనుకుంటున్నాడు. కాని, అదే ఆఖరు యుద్ధం-అదే హిట్లరుకు అంత్యదశ.

---

# సింగపూరులో భారతీయుల పరాక్రమము.

## తమిళ కార్మికులు ధైర్యంతో పనులుచేయుచుండిరి.

ఎన్. ఏ. మలాలుగారు, సింగపూరులోనుండి వచ్చిన భారతీయ బారిస్టరు ఢిల్లీ రేడియోద్వారా ఉపన్యసించుచు, సింగపూరులో విమానదాడి వివరములగూర్చి తెలిపిరి. అచట తమ అనుభవములను వివరంగా తెల్పుచు చివర కిట్లు నుడివిరి:—

"మన భారతీయ సైనికులు మలయాలో సింహాలవలె పోరాడిరి. మన భారతీయ సివిలు ప్రజలు చాల ధైర్యము, ఓర్పు, త్యాగము ప్రదర్శించి అందరి మన్ననలను బడసిరి. పరీక్షాసమయం వచ్చిందంటే, ఇండియాలోకూడ మనవారు తగినట్లు ధైర్యంతో ప్రవర్తింతురనుటకు నాకెట్టి సందేహం లేదు."

డిసంబరు 8 వ తేదీన జపాను విమానాలు సింగపూరుపై దాడి ప్రారంభించిననాటికి ప్రజలు దేశరక్షణ కార్యములం దెక్కువ ఉత్సాహం కనుపరచలేదు కాని మొదటిసారి బాంబులు పడేసరికి అందరు అన్ని పనులుచేయుటకు ఉత్సాహంతో వచ్చిరి. అచటనున్న భారతీయులు, చీనావారు, మలయాలు, డచ్చివారు, బ్రిటిషువారు, ఫ్రెంచి ప్రజలు అందరు కలసి ఒకటిగ ఆస్తిప్రాణరక్షణకు పాటుబడిరి. అదివరకు పూర్తిగ శిక్షణ పొందకపోయినప్పటికి సివిలు డిఫెన్సు పనులన్ని బాంబులు పడినతరువాత సమర్థతతోనే కొనసాగినవి. ఎ.ఆర్.పి. డిఫెన్సు దళము, వైద్యసహాయ దళము మున్నగు సంస్థలన్నింటియందు భారతీయులు చాలమంది చేరియుండిరి. వారంతా యితరు లెవ్వరికి తీసిపోకుండా కష్టపరిస్థితులందుగూడ శ్రద్ధాభక్తులతో తమ విధిని నెరవేర్చిరని తెలుపుటకు నేను గర్వించుచున్నాను.

### ద. ఇ. కార్మికులు.

సింగపూరులో సంహాని కవసరమగు ముఖ్యమగు సర్వీసులన్నింటిలో దక్షిణ యిండియానుండి వచ్చిన కార్మికులేలరు. తమిళ కూలివాడు చాల నెమ్మదైన నమ్రతగల సాధువు. తరుచుగ జరుగుచున్న విమానదాడుల బాధను వారు బాగుగ ఓర్చి నిలువకలిగిరి. తమిళకూలీలును, చీనా కూలీలులును చివరవరకు తమ పనులను విడువక ప్రశంసార్హముగ పనిచేసిరి.

ఒకసారి, పెద్ద విమానదాడియందు నేనున్న జిల్లాలో చాల బాంబులు పడినవి. చాలా యిండ్లు కూలినవి నా యిల్లుకూడా బాగా చెడింది. మేమంతా గోతులలోనో లేక దిగువ గదులలోనో దాగుకొనుట బాగుగ నేర్చుకొనియున్నందున, చాల తక్కువ చావులే సంభవించెను. దాగొనకుండా బయట తిరుగుచుండినవారే చనిపోయిరి. గోడలమధ్య దాగొనలేకపోయిన, నేలపైన పండుకోవలెను. మా తమ్ముని యింటివాకట్లో విమానదాడి రక్షణ గుహకట్టుచున్న నల్గురు కూలివారిలో ముగ్గురు దాడి జరుగుచున్న సమయమున ఆ గోతిలోనే కదలకయుండుటచే బ్రతికియుండిరి. నాల్గోవాడు సగం కట్టబడిన ఆ గుహకన్న తనయిల్లు భద్రమనుకొని పరుగెత్తేసరికి త్రోవలోనే చనిపోయెను. అతన్ని చంపిన బాంబు మా తమ్ముని యింటికి అతి చేరువలోనే పడెను. ఇంటిలోనున్న స్త్రీలు, బిడ్డలు అందరు భద్రంగానే యున్నారు.

ఆరోజు బాంబులు టెలిఫోను తీగలను చెడగొట్టినవి. రెండు రోజులలోనే తమిళ కార్మికులు స్థంబాలెక్కి ఆ తీగలను సరిచేయుట నేను చూచితిని, అదే సమయాన జపాను విమానాలు వచ్చేయి. పనివారు స్థంభాలుదిగి, తమ పనిముట్లనుకూడ దీసుకొని వీధిలో అవతలివైపునవున్న మురికినీటి కాల్వలో దాగియున్నారు. వారికి చాల దగ్గరనే బాంబులు పడ్డాయి. కాని వారికేమి అపాయం కలుగలేదు. విమానాలు వెళ్లిపోగానే తిరిగి స్థంభాలెక్కి తీగలు కట్టుచుండిరి—ఏమీ జరుగనట్లే యుండిరి. నా సోదరదేశీయులు జూపిన యీ ధైర్యానికి నేనెంతయు గర్వించితిని.

మలయాలో సివిలు ప్రజల ధైర్య సాహసములు, వీరత్వము ప్రకటించు కథ లెన్నో తరుచు పత్రికలలో పడుచుండెను.

ఈ కార్యము లన్నింటియందుగూడ భారతీయులుగూడ గౌరవ ప్రదముగ పాల్గొని ప్రశంసలు బడసిరని నే చెప్పగలను.

### భీతి లేనే లేదు.

విమానదాడివలన ప్రజలకు భయం యెక్కువై గాభరా పడలేదాయని పలువురు ప్రశ్నింతురు. మలయాలో ఒక్క తెగవారు తప్ప యింకెవ్వరు యీ దాడులవలన గాభరాపడ లేదు. బ్యాంకులు, వ్యాపారసంస్థలు, హోటల్సు, పెద్ద దుకాణాలన్నియు తెరచియేయుండెను. పనులు మామూలుగ జరుగుచునేయుండెను. చాల కంపెనీలలో పనిలోనుండి భారతీయులు చీనావారు ప్రతిరోజు పనులకు వస్తునేయుండే వారు. తీరికసమయాలలో సివిలు డిఫెన్సుపనులు చేస్తూ వుండేవారు. నిద్ర చాలకపోయినా యింతకష్టపడి వారు పనిచేయుట ఆశ్చర్యం కలిగించేది

పగటిపూట అందరికి కచేరీలలో పనులుంటాయి. అవి మానుకోలేరు. కావున విమానాలు వస్తున్నట్లు హెచ్చరిక చేయబడినపిదపగూడ పనులు చేసుకుంటూనే వుండేవారం. ప్రతి భవనంపై ఒకని కావలాయుంచి, విమానం మరీదగ్గరయే సరికి, అతడు తెలిపే హెచ్చరిక ననుసరించి మేడలుదిగి నేల గదులలోదాగొనేవారం. ఈప్రకారం చాల ప్రాణాలు రక్షింపబడినవి.

సింగపూరులో చిన్న దుకాణదారులుమాత్రం భయపడి పారిపోవుటవలన చాల యిబ్బందికలిగింది. నగరమధ్యనున్న తినుబండారముల దుకాణాలు, కాఫీహోటల్సు యజమానులు భయపడి మూసివేయుటవలన, దూరంనుండివచ్చి కచేరీలలో పనిచేసుకొనుచుండినవారికి, మధ్యాహ్నం తిండిలేకుండా పోయింది. పైగా ప్రజల రవానాకు మోటారుబండ్లు ఎలెక్ట్రికు లారీలు పెట్రోలుచాలక పనిచేయలేదు. ఇండియాలో చాల గుర్రబ్బండ్లు, ఎద్దుబండ్లు ఉన్నందున ఆ యిబ్బంది యుండదు.

సింగపూరులో పడిన జపాను బాంబులు చాల పెద్దవి కావు. చాలదూరంనుండి తేవలసియుండుటచే జపానువారు బరువైన బాంబులను తేలేదు. వాటిని సివిలు ప్రజలపై వృథాచేయరు. ఇండియాలో ఒకవేళ జపానువారు బాంబులు వేసినా అవి చిన్నవిగనే యుంటాయని, ఎక్కువ నష్టంకలిగించవని నా నమ్మకం. రెండంతస్తుల మేడపై యీ చిన్న బాంబు పడినపుడు, నేలవరకు చొచ్చుకొనిరాలేదు. నాలు గైదడుగుల ఎత్తు పునాదులతో కట్టిన బంగాళాలు యీ బాంబులవలన పడిపోయినవి, కాని అందులో నివసించువారు కొద్ది గాయాలతో తప్పించుకొనిరి. ఇటువంటి బాంబులు అట్టే నష్టంకలుగజేయు ఉద్దేశంతోకాకుండా, భీతి కలిగించాలని వేస్తారు. మొదట్లో యీ బాంబులు ప్రేలడం, విమానాల రొద, వాటినికొట్టే ఫిరంగుల ప్రమోత యివన్ని భయంగానే వుంటాయి, కాని తరువాత అలవాటయిపోతుంది. ఇండ్ల చేరువ గోతులుత్రవ్వుకొని దాగుంటే ఏమీ ప్రమాదంలేదు.

---

# జపాను నౌకాబలం ఐదోవంతు తగిపోయింది.

## పశిఫికు యుద్ధంలో జపాను నష్టం.

పశిఫికు సముద్రయుద్ధమునందు జపాను కొంత విజయం పొందుతున్నమాట నిజమే. ఆప్రాంతాలలో సర్వాధిపత్యం వహించుటకు జపాను విశ్వప్రయత్నం చేస్తున్నది. అయి నప్పటికి, యిటువంటి సమయంలోకూడా జపాను చేస్తున్న పని దానికి శ్రేయస్కరమేనా అని ఆలోచించడం యుక్తంగానే యుండును.

ఇంతవరకు జపాను గెలుపులతోబాటు నష్టాలుకూడా పొందుతున్నదని అందరు తెలుసుకోవాలి. తొమ్మిదివారాల యుద్ధంలో జపాను నౌకా దళంలోని మునిగినవని స్పష్టంగా తెలిసినవి, దెబ్బతగిలి చెడినవి అన్నికలసి 56 యుద్ధ నౌకలు పోయినవి. ఇవిగాక సేనలను తీసుకపోయేవి, వర్తక నౌకలు, చమురు నౌకలు 126 చెడిపోవుటో, నాశనమగుటో జరిగెను. అందువలన జపాను నౌకాదళం రవానా సౌకర్యములు తగ్గిపోయినవి.

జపాను నౌకాదళంయొక్క మొత్తం సంఖ్యలు తెలుసుకొని, దానిలో యీ మునిగినవి ఎన్నోవంతో తెలుసుకున్నచో యీ నష్టం యెంతో బాగా తెలియగలదు. మందుగనులు వేసే నావలు కాక, యితరములు అన్నిరకాల యుద్ధ నౌకలు 250 తో జపాను యుద్ధం ప్రారంభించిందని, యింతవరకు తెలియుచున్నది. 50 పైగా నౌకలు మునిగినవంటే, మొత్తం సంఖ్యలో 1/5 వంతు పోయినవన్నమాట, తూర్పు దీవుల సహజసరిహద్దులను ఛేదించి, హిందూ మహా సముద్రంలోకి పోయి, ఆస్ట్రేలియావరకు అధిపత్యం వహించాలను యత్నంలోనే జపాను నౌకాదళానికి యింత నష్టం కలిగింది. ఐదోవంతు దళం పోవడమంటే సామాన్యం కాదు.

నష్టపోయిన 50 జపాను నౌకలలో పూర్తిగ మునిగిపోకుండా దెబ్బతలిగినవికూడా కొన్నియున్నమాట నిజమే. కాని అవి మరమ్మతు చేయడానికి స్వంతరేవులకు చాల దూరములో నున్నవి. మకాసరు జలసంధిలో దెబ్బతిన్న స్టీమరులు జపానురేవులకు మరమ్మత్తుల కొరకు పోవలెనన్న 3,000 మైళ్లు దూరంపోవాలి. హాంగుకాంగునకు 2,000 మైళ్లదూరంలో నున్నవి. హాంగుకాంగులో మరమ్మత్తు రేవులు జపానుకి వశమగుటకు పూర్వం నాశనం చేయబడినవి. తిరిగి అవి బాగుచేయబడ్డాయనుకొన్ననూ, దెబ్బ తిన్న స్టీమరులను అన్నివేలమైళ్లదూరం యింకో స్టీమరులు యీడ్చుక పోవడం చాలా కష్టం.

### అచ్చటచ్చట అధికారం.

ఇంకో విషయం జ్ఞాపకముంచుకోవాలి. జపానుకి కలిగిన నష్టములు అప్రాముఖ్య సంఘటనలందు కలిగినవి. ప్రస్తుతానికి జపానుకి సముద్రంపై అధికారం వచ్చినప్పటికీ అది అంతటాలేదు. అచ్చటచ్చట మాత్రం గలదు. తూర్పు దీవులందు కొన్ని నౌకాశ్రయములు, రేవులు పట్టుకొన్నంత మాత్రమున సముద్రమార్గములన్ని వశమయినట్లుకాదు. అధికంగా నౌకలుంటేనే సముద్రమార్గాలు నిరోధించవచ్చును. అపుడే సముద్రాధిపత్యం లభించినట్లు. తన శత్రువులకన్న ఎక్కువ నౌకా బలం ఉన్నపుడే జపాను సముద్రాధిపత్యం వహించినట్లగును

### అమెరికా నౌకా బలం.

యుద్ధప్రారంభంలో పెరలు హార్బరునందు అమెరికా నౌకలు కొన్ని మునిగిపోయినప్పటికి, అమెరికా సంయుక్త

రాష్ట్రముల నౌకాదళమే యింకను జపానుకన్న ఎక్కువ. అది జపాను నౌకలు సముద్రంలో స్వేచ్ఛగ తిరుగకుండ చేయగలదు.

ఇపుడు గెలుచుకొన్న ప్రాంతాలను కాపాడుకొనుటకు, జపాను యిపుడు చేకూరిన సముద్రాధిపత్యంకూడ చెడకుండ ఉంచుకోవలెను. ఇంతవరకు జరిగిన నౌకాయుద్ధాలలో జపాను శత్రువుకిగూడా నష్టం కలిగించిన యుద్ధాలు రెండు మూడుకన్న ఎక్కువలేవు. ప్రారంభంలో ఒకసారి జపాను నౌకాయుద్ధంలో గెలిచింది. దాని ననుసరించి తూర్పు దీవులన్ని ఆక్రమించాలను ఆశలో 1/5 వంతు నౌకాదళమును జపాను గోల్పోయెను. చివరకు తమకేమి యెక్కువ లాభం చేకూరలేదు.

అమెరికా నౌకాదళమును బలహీనం చేయుటకై యుద్ధం చేసి తమ నౌకలను పోగొట్టుకొనియుంటే అది గొప్ప త్యాగమనుకోవచ్చును. అట్లుకాక, కాల్చివేయబడిన చమురు గనులు, నాశనం చేయబడిన నౌకాశ్రయములు పట్టుకొనుటకు యింత నష్టపోవడం, పెద్ద పొరబాటే గావచ్చును నౌకలుంటే గదా నౌకాశ్రయములు హార్బరులు ఉపయోగం ?

జపాను దీవులపైకి అమెరికా నౌకాదళం దాడిరాకుండ చేయుటకై ప్రారంభంలో జపాను నౌకాదళం సముద్రాధిపత్యం వహించాలని ప్రయత్నించింది. దక్షిణ చీనా సముద్రమునందు జపానువారి అధికారం కేవలం తాత్కాలికము. ముందు గెలువగానే ఉబ్బిపోయి, జపానువారు అప్రాముఖ్యమయిన దాడులుకూడ ప్రారంభించి నష్టపోయిరి. యుద్ధ సమయాలందు యిట్టి పొరబాటులు జరగడం సహజం.

జర్మను నౌకాదళాధికారులు యీ పొరబాటే గత యుద్ధంలో చేసి, తిరిగి యీ యుద్ధంలోగూడా చేసిరి. 1917 వ సం॥లో జలాంతర్గామి యుద్ధంవలన వారు విఫలులైరి అయినప్పటికి యీ యుద్ధంలోకూడ వాటి సహాయాన వర్తక వాణిజ్యముల నాశనం చేయడానికి తలపెట్టిరి. శత్రువుల నౌకాదళం ముందుగ నాశనం చేస్తేగాని యీ పనిచేసి ప్రయోజనంలేదని వారు గుర్తించుట మానిరి.

ఇట్లా వ్రాయడంవలన మిత్రమండలి రాజ్యాలకు కలిగిన నష్టం తక్కువని చెపుతున్నట్లనుకోరాదు. సింగపూరు పోయిందనియు, మలయా, తూర్పు దీవులనుండి వచ్చే సరకు నిలచి పోయిందనియు, ఆస్ట్రేలియాకు ముప్పు కలుగుచున్నదనియు మరచిపోరాదు.

అయినా, యీ రెండు మూడు నెలలలో జరిగిన విషయాలు, మొత్తం యుద్ధంలో చేర్చిచూచిన ఎంతవరకు లాభించునో లేదో చూచుకోవాలి. ఇది దీర్ఘ యుద్ధం. ఈ మాత్రం భూభాగం సంపాదించడానికి జపాను తన నౌకాబలం ఎంత గోల్పోయిందో చూడండి. తూర్పుదీవుల చెంతను జపాను నౌకాదళం 1/5 వంతు నాశనమయింది, పెరల్ హార్బరులో కొంత నష్టం కలిగినా అమెరికా నౌకాదళమే అత్యధికంగానుంది.

కొద్ది నెలలలో అమెరికా అనేక యుద్ధనౌకలను, క్రూయిజరులను, డిస్ట్రాయరులను తయారు చేయగలదు. జపానో, తన రేవులకు సింగపూరు, పెలాంబాంగు అంబోయినా రేవులు చాలదూరమునం దున్నందున ఎటువంటి సహాయము చేయలేదు. తాను నష్టపోయిన నౌకలు జపాను రేవులకు దగ్గరగనే ఉండిపోయియుంటే బాగుండుననీ, అప్పుడు జపాను విచారింపగలదు.

(హెచ్. సి. పరబీగారి బి.బి.సి. రేడియో ప్రసంగంనుండి.)

---

# రష్యా పరిశ్రమలు ఎక్కడున్నాయి?

## ఊరల్ పర్వతాలవతల అతి రహస్యంగా ఉంచబడ్డాయి.

### యుద్ధరంగానికి 800 మైళ్ల దూరంలో భద్రంగా ఉన్నాయి.

జాను స్కాటుగారు రష్యాలో ఇంజనీరుగ 1932 నుండి 1941 వరకు పనిచేసిరి. వీరు రష్యా స్త్రీని వివాహమాడేరు కూడాను. వీరు రష్యాలో పరిశ్రామిక సంపదగూర్చి యీ దిగువ వ్యాసం వ్రాసేరు.

ఊరలు ప్రాంతములందు రష్యా స్థాపించిన పరిశ్రమల గూర్చిన వార్తలు అతి రహస్యంగా ఉంచబడినవి. ఇవి యుద్ధరంగాలకు 800 మైళ్ల దూరమునందున్నవి. యూరోపు చేరువగానున్న రష్యాభాగములోనున్న పరిశ్రామిక స్థానములు కొన్ని జర్మనీ వశమగుటచేతను, కొన్ని బాంబులచేత చెడగొట్టబడుటచేతను, ఈ సోవియటు రష్యా యిక ముందు యుద్ధంచేయుటకు ఊరలు ప్రాంతముల పరిశ్రామిక సంపదపైనే ఆధారపడియుండును. ఇటువంటి పరిస్థితులు వచ్చునని ఊహించియే కాబోలు 15 సం॥ల క్రిందటనే యీ పరిశ్రమలచట స్థాపించబడినవి.

ఇదంతా వట్టి కబుర్లే అచట నేమీలేవని కొన్ని పత్రికలు వ్రాసినవి. అది సరిగాదు. ఊరలు ప్రాంతములందున్న అతి పెద్దవగు పరిశ్రమలను యంత్రాలయములను నేను స్వయంగా చూచితిని. అచట ఐదు సంవత్సరములుంటిని. ప్రపంచములో పెద్ద పరిశ్రమల కేంద్రాలలో నది యొకటి. 200 పరిశ్రామిక యంత్రాలు, అందులో కొన్ని చాల పెద్దవి 1930 నుండి 1940 లోపల అచట నిర్మించబడినవి. 1939 లో యీ యూరోపు యుద్ధం ప్రారంభించినప్పటికే, ప్రమాదకరమగు తావులనుండి యుద్ధానికి చేరువగ నుండు స్థలములనుండి యీ యంత్రాలు అపుడే ఊరలు ప్రాంతాలకు రవానా చేయబడుచుండెను. నేను స్వయంగా కొన్నింటిని చూచితిని. మిగిలినవాటినిగూర్చి విన్నాను. యుద్ధ పరికరాలు చేసే శక్తి రష్యాకు తగ్గిపోయింది. కాని రష్యా బలంమాత్రం తగ్గలేదు.

#### ఊరల్సు సంపద.

ఊరలు ప్రాంతములు 500 చదరపు మైళ్లుండును. విశాలమగు దేశ మధ్యభాగమునందున్నది. ఇనుము, బొగ్గు, రాగి, ఎల్యూమినియం తయారుచేయుటకు బాక్సైటు, సీసం, అస్బెస్టాసు, మాంగనీసు, పొటాష్, మెగ్నిషియం, బంగారం, వెండి, ప్లాటినము, తుత్తునాగం, పెట్రోలు అక్కడ లభించును. గొప్ప అడవులున్నాయి. వేలకొలది ఎకరాల సాగుబడి నేల కలదు.

1930 వ సం॥ వరకు యీ ప్రాంతాలు బాగుగ ఉపయోగించలేదు. రష్యాయొక్క పరిశ్రమలలో నూటికి 90

వంతు యూరోపు సరిహద్దుల చేరువగానే యుండెను. పాలకులు అది గుర్తించి, ఎప్పటికైన అది ప్రమాదకరమే యని ఎంచి, శత్రువులకు దూరంగా పారిశ్రామిక సామ్రాజ్యం కట్ట నిశ్చయించిరి. స్టాలిను నియంత యీ పని అతిచురుకుగ జరిపించెను. అందుకు విశేషంగా ధనవ్యయం, శ్రమ జననష్టం కూడా కలిగెను. అయినా మొటుతనంతో స్టాలిను యీ కార్యం కొనసాగించెను. రష్యా ప్రభుత్వాదాయంలో నూటికి 56 వంతు 143 లో పరిశ్రమల స్థాపనకే వెచ్చింపబడెను. అమెరికా సంయుక్త రాష్ట్రములందు ప్రథమ పారిశ్రామికాభివృద్ధి జరిగే కాలంలో (1860—70) దేశరాబడిలో నూటికి 12 వంతుకన్న ఎక్కువ పరిశ్రమలకై ఖర్చుచేయలేదు. ఆ ద్రవ్యంకూడ బ్రిటిషు పెట్టుబడిదారులే యిచ్చిరి. కూలిపని, కాయకష్టం పనికూడా యూరపునుండి వచ్చినవారే చేసేవారు. సోవియటు రష్యా పరిశ్రమల అభివృద్ధికి చాల తక్కువ అప్పుచేసెను. పనిచేసిన మనుష్యులంతా రష్యనులే.

## ఇనుము—బొగ్గు సమకూర్పుట.

1929 లో మాగ్నిటోగోరస్కు నగరం ఆ పేరుతో లేదు. అచ్చోట కొండవొడ్డున ఒక పల్లెటూరు వుండేది. అచటి కొండలన్ని నిద్ద ఇనుముకొండలే. అందుకే "మగ్నాటిక మాంటెను" (సూదంటు రాతి కొండలు) అను పేరు వచ్చెను. రెండువందల సంవత్సరములవరకు ఎండకాలంలో మాత్రం యీ కొండనుండి కొద్దిగ ఇనుము త్రవ్వి తీసి, 70 మైళ్లవరకు తీసుకపోయి, బెలోరిస్కువద్దనున్న బొగ్గు ఆవంవద్ద కరిగించేవారు. దానిచేరువ చెట్లుకూడా వుండేవి కావు.

ఈ ఇనుముకొండలను 2,000 మైళ్ల దూరంలో కూజబాసు వద్దనున్న బొగ్గుగనులతో కలుపుటకు రష్యా ఇంజనీరులు ప్రయత్నించుచుండిరి. ఇనుము బొగ్గుగనుల కూడలి యింత పెద్దది యింకెక్కడ ప్రపంచంలో ఉండదనుకున్నారు. శత్రువులకు ఎంతమాత్రం అందదు అయితే వీటి రెండింటిని కలుపుటకు ఖర్చుమాత్రం చాల అధికమగును. అయితేనేం పెట్టదగినదే అనుకున్నారు.

మాగ్నటిగోరస్కు నిర్మాణమునకు 200 కోట్ల రోబుల్సు (రష్యను నాణెము) ఖర్చు అంచనా వేయబడెను. అందు 30 కోట్లు విదేశాలనుండి తెచ్చిరి. ఆ అప్పు తీర్చుటకు రష్యాదేశంలో వుండే గోధుమలు, వెన్న మున్నగు వస్తువులు ఆ దేశాలకిచ్చి, స్వదేశాలకు లేకుండా చేసుకోవలసి వచ్చింది.

మాగ్నటికుగోరస్కువంటి యితర పారిశ్రామిక కేంద్రములనుగూడ నేను చూడగల్గితిని. చెలియబిన్స్కునందు నాగలియంత్రాలు తయారుచేయు పెద్ద కర్మాగారము, స్టానొక్రాస్ట్రోయియందు యంత్రపు పనిముట్లుచేయు కర్మాగారం గలవు. ఈ రెండు చోట్ల టాంకులు తయారుచేస్తున్నారు. స్వెర్డ్లోవిస్కునందు అమెరికాలో తయారుచేసేలాంటి విమానాలు తయారు చేస్తున్నారు. ముందచట జలాంతర్గాముల భాగాలుచేసి, కూర్చి అన్ని సముద్రాలకు పంపేవారు. ఆ వూరులో ఎలక్ట్రిక్ యంత్రాల కర్మాగారములు, మందుగుండు ఫ్యాక్టరీలు గలవు.

చునోవాయాలయందు మేలురకం ఉక్కు తయారగును. దానికి తూర్పున క్రాసునోరలస్కునందు రాగి కరిగించు యంత్రాలు గలవు. రష్యాకు కావలసిన రాగి అంతా ఊరల్సు ప్రాంతాలనుండే వస్తుంది. చెలియబిన్స్కునందు తూతునాగము, అలపవిస్కునందు అస్బెస్టాసు విశేషంగా తయారగును. కమీలోనో, ఉఫలీలందు కొంతనికిలు తయారగును. రష్యా ఎల్యుమినియం సంపద ఎక్కువగ యూరోపు చేరువ ప్రాంతాలలోనుండినా, ఊరల్సులో కూడ కొద్దిగనుండెను.

ఊరల్సు ప్రాంతంలోనే ఉఫయందు చమురుగనులు కలవు. కాని యీ చమురులో గంధకంపాళ్లు ఎక్కువ అచటు గాసోలిను యంత్రం స్థాపించబడెను. అమెరికను ఇంజనీరులచటు పనిచేసిరి. అచట విమానాలకు కావలసిన గాసలలీను 500,000 టన్నులు మొదటి ఏడాదిలోనే తయారు కాగలదని వారు చెప్పిరి. ఉఫావద్దనే డీసెలు మోటారులు విశేషంగా తయారవతాయి.

రష్యా ఉత్పత్తికి అదిని ప్రధాన ప్రతిబంధకాలు విద్యుచ్ఛక్తి, రవానా సౌకర్యములు లేకుండుటే. ఊరల్సులో విద్యుచ్ఛక్తి తయారుచేయు కేంద్రాలు ఏడు నిర్మించబడెను. 100 కోట్ల కిలోవాట్సు విద్యుచ్ఛక్తి వాటిలో తయారవుతుంది. ఒకటి మూసివేసినా మిగిలినవి పనిచేయుటకు వీలుండునట్లు అవి నిర్మించబడినవి. రైలురోడ్లు వేయుటకు చాల శ్రమపడి, మూడు క్రొత్త రైలు మార్గములు నిర్మించిరి.

## విమానాల ఉత్పత్తి.

విమానాల ఉత్పత్తియందు రష్యా వెనకపడింది. అయినా ఎంతపని జరుగుచున్నదో యితరులకు తెలియదు. పెరమ్‌లో విమానాల ఇంజనులు తయారుచేయు కర్మాగారము చాల పెద్దది కలదు. ఇది యుద్ధరంగానికి 1,000 మైళ్ల దూరంలోనుంది. ఇది నిర్మించు తొలి వత్సరాలలో విదేశీయు లెవ్వరిని అచ్చోటికి రానీయలేదు. అందలి పనివారినిగూడ బయటివారికి చెప్పేస్తారేమోనని, ప్రయాణాలు చేయకుండ నిరుత్సాహపరచేవారు.

యూరోపు యుద్ధరంగానికి 200 నుండి 3,000 మైళ్ల దూరంలోనున్న మురోనాజి, గోర్కి, కజను, టోమస్కు, ఇర్కుట్సు, కాచరోవిస్కి, కోమసోమస్కులందు విమానాల నిర్మించే యంత్రాలుగలవు. రీనిన్స్కు, పెరనులలో విమానాల ఇంజనులు తయారగుచున్నవి.

యుద్ధరంగంలోనుండిన విమాన నిర్మాణ యంత్రాలు చెడిపోకుండా లోభాగానికి పంపివేయబడినవని నా నమ్మకం. ఏడాది క్రిందటనే యీ యేర్పాటులు జరిగినవి అనేక రైళ్లలో యంత్రాలు తూర్పునకు పోవుట కనబడుతూ వుండేది. జర్మను బాంబులవలన ఏమయినా నష్టమయిందేమో రష్యా సైన్యాధికారులే చెప్పాలిగాని యింకెవ్వరికి తెలియదు.

రష్యా విమాన కర్మాగారముల జాబితా నాకు తెలిసినంతవరకు తయారుచేయగా, 20 పేర్లు చేరినవి. నాకు తెలియనివి, రష్యా అధికారులు రహస్యంగా వుంచినవి ఇంకా ఎన్నో సైబేరియాలో వుంటే వుండవచ్చును. ట్రాంసు సైబేరియను రైలుమీదుగా వస్తూవుంటే, అనేకచోట్ల క్రొత్త కర్మాగారాలు, పారిశ్రామిక నగరాలు కనబడుతూనే వున్నాయి. అవే యంత్రాలను తయారు చేస్తున్నవో ఎవ్వరు చెప్పరు.

రష్యాకు యిపుడు యుద్ధంలో తగిలిన దెబ్బలు ఆర్థికంగా పెద్దవికావు. యుద్ధంలో కావలసిన యంత్రసామగ్రి యింకా విశేషంగా తయారు చేసుకోగలదు. పడమరను పరిశ్రమలు శత్రువులవలన నష్టమయినా, తూర్పున పరిశ్రమలు ఎవ్వరికి తెలియకుండా విశేషంగా పెంచుకున్నది. కావున ఏమీ పరవాలేదు.

MADRAS : PRINTED AND PUBLISHED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.